శ్రీ రామాయనమః

# శ్రీపరంధామ దండకము.

శ్రీమత్ప్రసన్నాభిరామం ప్రభాదివ్యధామం ప్రకీర్తిప్రకాశమం ప్రభో ధ్యాత్మరామం మదీయాత్మనేయం భజే కోసలేయం । భజేహం విదేహాత్మజాప్రాణలోలం । భజేహం సదా నానాగ్రహాగ్రేసరస్పక్త బృందారకా బృందసంసేవ్యమానం దసలం । పురారాతినంద్యం నిరాకారమీడ్యం । సదానందరూపం । మృడానీహృదబ్జాసనాధిష్ఠితాహ్లాదరూపం । సదానీకదుఃఖౌఘనాశం । ధరాభారనాశైకహేతుప్రకాశం భజేహం బటుంచుం । భవన్నామచారిత్ర సంకీర్తనాపాదకైం కర్వ చిత్తప్రభారాద్యులై యొప్పు నీదాసదాసానదాసుండనై నీదుపాదాబ్జముల్ నాదుహృత్కంజపీఠంబునందుం బ్రతిష్ఠించి పూజించి సేవించి కీర్తించి నీమీద నేదండకంబొక్కటిం జెప్పగాబూనితిం । నీదయాదృష్టివీక్షించి మన్నించి నాతోడుగా బల్కుమీ । జానకీహృల్లలామా । పరంధామరామా। భవద్దివ్యచారిత్రజాలంబులన్నింపగా నొక్కటిన్నాలుగ్గైదుం మరిం రెండువేల్జిహ్వలుం గల్గువారైన వర్ణింపలేరయ్య నేనెంతవాడం కృపంజూచి బల్కించుమీ భానువంశాబ్ధిసోమా। నమాం బ్రోవు శ్రీరామరామా ।

నాకంబు మూర్ధంబు వీర్యంబు వర్షంబు సింధువులు శాఖలుల్ సురానీకమున్ రోమముల్ దైత్యసంఘంబువేదంబు గంధర్వవిద్యాధరాప్సరస్సబృందంబుషడ్జాతులైనట్టి సప్తస్వరంబుల్ ఘనంబుల్ కచంబుల్ జలంబుల్ సదాదాతువుల్ సర్వనక్షత్రలోకంబె వక్షం బహోరాత్రముల్ రెప్పలున్ కాలమున్యాన్యానమున్ నవ్వులేమానవుల్ వీక్షణాల్ నారకంబంతకుంషగ్రి దంతంబు లాయశ్వముల్ గోరులున్ నేరులున్నాడులున్ సింధువుల్ కుక్షి శల్యంబులద్రుల్ శిరోజంబులున్ వృక్షవర్గంబు భ్రూయుగ్మమే బ్రహ్మసంస్థానమై వెల్గుచున్నట్టి యుష్మన్ముఖాంభోజమందుండి విప్రోత్తముల్ బాహుమూలంబునందుండి రాజేంద్రులున్ ఊరులందుండి వైశ్యోత్తముల్ పాదమందుండి శూద్రుల్ జనింపంగ వర్గిలగాజేసెతీ వెగదా విశ్వరూపాత్మకా సర్వభూతాత్మకా యిట్టినీవిశ్వరూపంబుదర్శించివర్ణింపగో పెమ్మపాగాదులేగాని నేనెంతవాడన్ భవాంభోధి సంతారకా పాపసంహారకా

ముకుందాభివర్ణన, వటపత్రశాయి.

యిమ్మహాబ్రహ్మకల్పావసానాదికాలంబులో నన్మహాకాశమందుంఘటాకాశముల్ లీనమైనట్టి చందంబునన్నీమహాగర్భగోళంబులంబొందుగానిల్పి యాసర్వలోకంబు లేకార్ణవంబొప్పగా నీవనొక్కండమున్నీట మధ్యస్థమర్రాకుపై హస్తపద్మంబుచే పాదపద్మంబువక్త్రారవిందంబునందుంచి శయ్యాసనాసీనబాలంముకుందాభిదానుండవై మందహాసంబుతో తేజరిల్లింగనిన్ జూడనాకాంతిచే వారిమధ్యం

బునందంతటన్ వీకయపోకలంబోకరమే కాకిన్నా బల్ యుగం
బుల్ మహాభక్తి చే నీదులాడంగగానొక్కచోనిన్నుదర్శించి
ప్రార్థించి నీయాజ్ఞ నీగర్భగోళంబులోజొచ్చి బల్ప
క్షముల్లందువేసారి యందందు సంకాశనైయున్నట్టి యీరేడు
లోకంబులంజూచి నీమాయగానంగ రాలేక నయ్యంతరాళం
బుసుఁగన్వీడి బాహ్యంబుకున్వచ్చి నీసమ్ముఖంబందు తానిల్చి
సద్భక్తి సేవించి గీర్తించి యందాడగా పాడగా నీదుకారుణ్య
సంపూర్ణనిక్షేపముంబొంది బల్ధన్యుడై వెల్గుచున్నట్టి మా
ర్కండ మౌనీంద్రుడేకాని నీమాయగానంగ నేనంతటింవాడ
మూఢుండ వ్యర్థుండ నవ్యక్తుడఁ నన్నుమన్నించి బ్రోవంగ
రావేద శస్యంద నాధీశ్వరాభీష్టసిద్ధిప్రదా సజ్జనస్తోమ మో
క్ష ప్రదా.

ఆదివిరాణ్మూర్తి వర్ణన,

నీవయేయాదినారాయణాఖ్యుండవై క్షీరావారాశి
మధ్యస్థితాభోగిరాడ్భోగ పర్యంకమందుండి సాహస్రశీర్షాది
దేవుండవై యాదిలక్ష్మీమహాదేవి సంయుక్త శ్రీవత్సవక్ష
శ్చతుర్బాహుకంఠాది సర్వాంగ భాస్వత్కళాపూర్ణ యు
క్తుండవై రత్నమాణిక్య సంఘట్టితాదీప్యగ్రైవేయ కేయూ
రహారాళిజంచత్కిరీటాది సంభూషణాలంకరిష్టుండవై శం
ఖుచక్రాదిగా దివ్యపంచాయుధోపేతకై దండ యుక్తుండ
వై నీలమేఘాభసంశోభితాంగుండవై భూరిపీతాంబరాలంక
రిష్టుండవై యాదివిష్ణుండవై నిష్కళంకుండవైనిర్వికల్పు
డవై నిర్వికారుండవై నద్వితీయుండవైని త్యశిద్ధుండవైయే

కమెవాదినారాయణాభిఖ్యతోల్లింటి దేవుండవై వెలుంగుచున్న
ట్టి నీయాదిపీఠాత్స్వరూపంబుదర్శించి సేవింపుచుండేటి భా
గ్యంబుపుణ్యాత్ములయినట్టి యా దేవకీ దేవి కౌశల్య యానా
రదాదిత్యమౌనీంద్ర సంఘంబు కేగాని సామాన్యనాబోటి పా
పాత్మవర్గంబుకున్ శక్యమౌనే మహాదైవరాయా నమో
యాది నారాయణాయా.

మీనాదిషడావతారములు.

యిదింగాక నాయాయికాలంబులందున్ నిషంగస్థి
తామోఘదివ్యాస్త్రరాజంబుమాడ్కింత్వదియావిర్భా
పముంముండి, యొక్కొక్క యంశంబయో తెంచి తత్తన్నిమి
త్తాను రూపావతారంబులందాల్చుచుం దుష్టసంహారముం
శిష్టసన్మానముం జేయుచుం గార్యనిర్వాహముం దీరగా నంత
నాయంశముం బూర్వరూపంబునం జేరుచున్ వచ్చె నాకేళియ
ట్లున్నచో పూర్వకల్పావసానంబునందున్మ హరిమీనరూపం
బునుండాల్చి ఫేనుండవున్నైహయగ్రీవు నిండృంచి వేదంబు
లం దెచ్చి యాబ్రహ్మకున్నిచ్చి వైవస్వతాభిఖ్యమన్వంతరా
రంబునిర్మింపవే దే.

సురల్ దానవానీకముంగూడి క్షీరార్ణవం
బున్ మథింపంగా నక్కాలమందున్ మహాకూర్మరూపంబు
నందాల్చి నత్తన్పృష్ఠభాగంబునన్ హేమశైలంబు నందా
ల్చియుంకించితేనా దా

క్రోడరూపంబవై భూసతీవారి మధ్యాంత
రాళంబులన్ హెచ్చితేనాడి యా దుష్టహేమాక్షునింజీరి

మహోరాశి దేదీప్యలాంఛన్య శ్రీవత్సశ్రీతామహాలక్ష్మీ సంయు
క్త తేజోపరిబాదకువక్షుండవై నీలనీరాభ్రసంకాశ శ్యామాం
గలావణ్యరూపుండవు నై శరచ్చంద్రవక్త్రోల్లసత్పద్మనేత్రుం
డవై దివ్యసంకాశ కోటీరమాణిక్య సంపత్కిరీటాది శోభావి
రాజన్నిభామూర్తి వంతుండవయి యాదినారాయణాఖ్యుం
డవై మానుషాకారివై చక్రశంఖంబులుం బాహ్రితృయుగ్మం
బునై శేషపర్యంకమున్లక్ష్మణుండై నినుంగొల్వగా దివ్య
పూర్ణావతారుండవై నిర్జరాధీశసంకల్పలాభుండవై దానవో
ద్రేకదోర్దండవిచ్ఛేదభీముండవై వెల్గుచున్నట్టి శ్రీజానకీరామ
బ్రహ్మాభిధానంబుతోడన్ సదానందకందంబగున్ మోక్షప
ట్టంబునన్నాథుడై నప్పరబ్రహ్మకుం ధర్మపత్నిత్రికంబొప్ప
గావారిలో జ్ఞానశక్తి మహాదేవి కాత్ముండవై పుట్టియవ్యక్త
తావస్థచేమాయకుంజిక్కి ప్రజ్ఞానమున్వీడియజ్ఞానమైనట్టిజీవా
త్మయేతానటంచుం భ్రమామోదముం జెందిదేహేంద్రియాది
ప్రపంచంబునం దైన రాగంబునంజిక్కి శ్రావ్యంబుచే దెల్విని
బొందివయిరాగ్యయుక్తుండవై పంచసంజ్ఞామహాపాతవర్గం
బులందాటిజ్ఞానంబునుంబూని ప్రాకారముం దెంచి యూయి
చ్ఛనుంగ్రోసి యామావికారంబు లంగూల్చగానేదురాచా
రముం దన్నియచ్చోసదాచారముంగాంచి యేకాంతముం జే
రగా శాంతముంగూడగా సందసూయాఖ్యనుంద్రుంచి యా
నందముంబొంది గర్వంబునుంబట్టి భంగంబుగావించి యా
మోక్షపట్నంబునం జేరి జీవత్వరాహిత్యముంగూర్చి య
త్నింపగా నక్రియాశక్తిచే చాపలత్వంబునుం బొందగా

నాపరబ్రహ్మనుం బొసీ యామోక్షపట్నంబుకుస్వేశి యా
నందవైరాగ్యముత్వొంటనుం బాయుకుంపంగ చిత్తంబునుం
మీారి సద్బుద్ధినింజూచిమన్నించి యాతాపసావాసముంజేర,
యామూనసరంబున్న వశ్యంబు వశ్యంబు నొక్కటిగావించి వీర
త్వమున్న నిష్ఠ ధీరత్వముంజెంది కామంబునుంగోసి యాగా
ఢకర్మంబులంగొట్టిచుం ఇచ్ఛతీమోసముంజెందగా రాజ
సంకెచ్ఛగాడంబ ముంజూపియానందమున్ మాయ జేయంగ
నయాత్మ యాయిచ్ఛనుంద్రుంచి యానందముంగానకన్ ఖేద
ముంజెంది వైరాగ్యముంగూడి విక్షేపముంద్రొక్కి వేసారి
యచ్ఛివివేకంబును నిర్మలత్వంబుగావించి యాచిత్తవైక
ల్యముంజించి సంతోషముంగాంచి దానన్ మనోల్లాసము
బొందగానే నిదిధ్యాససన్మానముం దుంభయంబున్విదారింప
గానిర్భయుంజెచ్చరించంగతోడంనిదిధ్యాసమా మోహాము
దాటి యాలోభముంగూల్చి దుర్వాసనల్ మట్టుగావించి
యానందముంగాంచి సంకల్పమున్ నాశమొందించి యజ్ఞా
నముం భస్మముంజేయగా సంశయంబున్ విదారించి యా
వైపరీత్యంబునుంమీారి యాభ్రాంతినింద్రుంచి యారాజసం
బున్ పోడంగాంచగానే తిరస్కారముంజేసి మానంబుగావిం
చి దుఃఖంబునుంగాల్చి మోహంబునిర్జించి యాయాత్మనుం
గాంచి కన్గొంటినానందమున్నేనటంచున్ మరీవిన్నవింపంగ న
యాత్మయున్ హెచ్చి యామోహముంబట్టిబంధింపుచున్ని
శ్చలత్వంబునుందిట్టముంజేసి సత్వంబుమన్నించి హాశ్చర్య
ధిక్కారముంజేయగా గొప్పసందేహముందోచగా సద్విచా

ంబు వేదాంతనిర్వర్తి గావించి యాత్మానుసంబుక వడింజంప గానంత వైరాగ్యమాభీమరూపభ్రమాశక్తి కింజక్కాగానే ని ధిధ్యాసయాకర్షకంబైన నిష్టాగతంబొంది వైరాగ్యముక హెచ్చి హాశ్చర్యముంజంపగా సంచితంబంతయుం సాధనా స్త్రంబుచేనాశముంజేసిగాంభీర్య తంబూనగా రాజసంబత్తి రింమోహారించంగ నాయాత్మయుం హెచ్చి జ్ఞానంబుసంధించి హంకారవిచ్ఛేద్యముం జేసి యాయింద్రియ శ్రేణినిందృంచ గా రాజసంబంతటన్నాశముంజెందగా మానమందుండి యా నందముప్పొంగుచున్నాత్మనింగూడగా నాత్మ డామోహ ప ట్నంబుసంజేరి జీవత్వరాహిత్యముంబొంది సాక్షాత్పరబ్రహ్మ మెతానవైముక్తి కాంతాలలామానైపత్యంబునుంబొంది వె గ్గాంముపా రెవ్వరోనివయే గాదె యాత్మ మహాత్మానినుం గాంచి సేవింపగన్ తత్పదత్వంపదాసీతివాక్యార్థ పజ్ఞానులె గానియోగీంద్ర మౌనీంద్రులైనంగనంజాలగాలేదు నేనెంతవా డక భవద్దివ్యపాదార విందార్చ నాభక్తిభావంబునంజేసి సన్నిలు కొమ్మీ సదాభక్తలోకైక రక్షావిధేయా పరా దైవరాయా.

కృష్ణబుద్ధకల్క్యవతారములు.

ఆహా ధారుణీభారముంజూచి బలాత్మకృష్ణాఖ్యలం దాల్చి యాదారుణాంతర్యులైనట్టి యాకంసదుర్యోధనాదిక వ్యాదంతవక్త్రాదిగాదుష్ట సంఘంబులంగొట్టి యాపాండు రాజాత్మజానందకంబుంగటాక్షించితీవేకదా కల్యాగారంభ కాలంబునంపూంధ...వంబంత యా...సానీకమైకల్మ

పాచ్ఛాదకమైయుండగాజూచి తద్దోషనాశంబుగావించి సం
శుద్ధబుద్ధ్యాకృతిందాల్చి వెల్గొందుచున్నంటివే దేవ దేవా మరి
న్కల్యుగాంతంబునం దెల్లదుష్కర్మ దుష్పాలనాకారులైనట్టి
భూదేవభూపాల వర్గంబులంజూచి కల్క్యవతారుండవైదు
ష్టసంఘుంబుచెండాడి మాయాకలింజంపగానే కృతారంభసం
దేశమొందంగ ధర్మంబునుంనాల్గు పాదంబులఁసంప్రవర్తిం
పగన్నాజ్ఞనిర్మించగా బూనువారెవ్వరో నీవయేగావె యోభ
క్తవిశ్వాసభావా యహోయాదిదేవా పరాకా.

సర్వపూర్ణ బ్రహ్మము:— భవద్దివ్యనామావతార
ప్రభావాదులెన్నన్ననంతంబులై చెల్లుచుండెం
గదేరామ నీవాదిదేవుండవై యాదివిష్ణుండవై నీవెరుద్రుం
డవై బ్రహ్మవై శ్రీపరంజ్యోతివై శ్రీపరబ్రహ్మచైతన్యవిజ్ఞాన
రూపుండవై పంచభూతంబులున్ నీవయాపంచభూతాత్మవు
న్నీవ సూర్యుండ వున్నీవ చంద్రుండవున్నీవ యాతారలున్నీ
వ ఖేటంబులున్నీవ యాయంతరిక్షంబునున్నీవ యింద్రుం
డవున్నీవ స్వర్గంబునున్నీవ భోగంబులున్నీవ పుణ్యంబులు
న్నీవ పుణ్యాత్ములున్నీవ మేఘంబులున్నీవ వర్షంబునున్నీవ
సస్యంబులున్నీవ బీజంబులున్నీవ యావోషధుల్ నీవ య
న్నంబునున్నీవ నీరంబునున్నీవ యుత్పత్తియున్నీవ కాలంబు
లున్నీవ కర్మంబులున్నీవ కార్యంబులున్నీవ యాకారకుల్
నీవచేనేదియున్నీవ చేయించుటన్నీవ కాలుండవున్నీవతన్నా
రకానీకమున్నీవ శైలంబులున్నీవ నద్యాదులున్నీవసంద్రం
బులున్నీవ నీరాటవుల్ నీవ పాతాళమున్నీవ యాభోగులు

ంబు న్నవ భోగేంద్రుఁడున్నవ లోకంబులున్నవ లోకేశులున్నవ
గాన యాదిక్కులున్నవ దిక్పాలకుల్ నీవ యాయక్షగంధర్వ వి
ధిధ ద్యాధరాదిత్యదైతేయ సిద్ధాదిగా ఖేచరవర్గమున్నవ భూ
మ్యాదులున్నవ భూపాలకుల్ నీవ దుర్గంబులున్నవ ప్రాసాద
ముల్ నీవ గ్రామాదులున్నవ గ్రామణాముల్ నీవ యామహా
నవుల్ నీవరణ్యంబులున్నవ వన్యంబులున్నవయా భూతక్షేత్రా
ళవర్గాదిగాగాములున్నవ యాశక్తులున్నవ యంత్రంబు
లున్ సర్వమంత్రంబులున్నవ మంత్రాధిపుల్ నీవ తెల్పేదియు
న్నవ తెల్పేదియున్నవ యజ్ఞంబులున్నవ
యజ్ఞేశుఁడున్నవ యాకర్తవున్నవ యాభోక్తవున్నవబుష్యా
దున్నవ యోగంబులున్నవ యోగీంద్రుడున్నవ నుష్టానము
న్నవ కోరేదియున్ నీవ యిచ్చేది యున్నవ ప్రార్థమున్నవ
సంప్రాప్తమున్నవ పొందేదియున్నవ వీడేదియున్నవ రాగం
బున్నవ వైరాగ్యమున్నవ ఆంతర్యమున్నవ బాహ్యంబు
న్నవ జీవాత్మలున్నవ సర్వాత్మవున్నవయో రామ నిత్యుం
డవై సర్వమున్నిండి సంపూర్ణమై నీవయొక్కండవై సర్వ
ముంజూచుచున్నావ దేనిపోగానట్టి ధన్యంబుని పారశౌకా
గ్రిమంతైన యెందేనియున్ లేదయా రామ యిట్టిట్టునీరూప
నామప్రపంచంబునం జేసి సీతారకబ్రహ్మ మంత్రంబునైనట్టి

ఫలస్తుతి,

(శ్రీరామ శ్రీరామ శ్రీరామ) యంచున్ సదామానస సం
బంధనుష్ఠించుచున్నన్న బూజించి సేవించి కీర్తించితే పాపము
ల్ బాయువే తాపముల్ దీరవే బాధనల్ వీడవే దైర్యము

జక్షుదేవస్త్రీసంగ్రహస్తంభితులగ్గావే మానవదత్త ప్రాణి
సంపదల్ దేహాస్త్రావే భాగ్యముల్ గగ్గావే రాజ్యముల్ హేరా
కార్యములన్ ధీయవే మారియుంజాకదే శ్రీశక్తియంత్రాత్రగే
భూతప్రేతాళి పిశాచడాకినీ శాకినీ హాకినీ కామినీ మోహినీ
యక్షిణీ భైరవీ చండీ కాళికా చాముండీ కాదూతికా సూతికా
శూలికా ఘూర్ణపరగ్రహసర్వశక్తి గ్రహ భద్ర మంత్రగ్రహ
సూర్య తంత్రగ్రహ బ్రహ్మరాక్షసి తాంత్రికాగ్రవేతాళపిశాచగా
లికా ఘాలికాద్యాదిగా సర్వభూతగ్రహానీకమున్ పీక తైక్షీక
ఐహికలం మానికా రాకులంక్షోలికా రోటవుల్ బట్టితా శా
రకజ నిల్చునే సీతపిత్తశ్లేష్మకావీతివాతాదిమె హజ్వరంబు
ల్ పురాణజ్వరవ్యాధులున్ మానవే పార్శ్వగర్భస్థ నక్రోత్రి
పై తాల్యాదిగా గల్గుసర్వాంగశూలాది రోగంబులుంటికవే దేవ
దైవీక రాజక చోరత్వ శార్దూల సింహాది వ్యాఘ్రాది పెన్
బాధలున్ మానవే మూషికావృశ్చికాసర్పజంబూక శ్వా
నాదిగా దుర్విషంబుల్ వడిన్ నాశముంజెందవే సర్వరోగంబు
లుంమానవే మానవాకార యోభక్తమందార యోపాప్యా
సంచార యోదేవ వేదాత్మ నాదాత్మ సర్వాత్మ ఆంహ్రీం
క్రోంహ్రీంఆంఓంనమోరామచంద్రాయ యాగచ్ఛ యాగ
చ్ఛ శ్రీంహ్రీంఐంహ్రీంశ్రీంనమోభక్తలోకైకరక్షాయ
త్రైలోక్యసంమోహనాంగాయ యావేశయావేశ ఆంహ్రీం
క్రోంహ్రీంఆంఅస్మదాంతర్య పీకేచిరంతిష్ఠ తిష్ఠ హుంఫట్
స్వాహా శ్రీయోగరామా పరంధామరామా ఘనస్వాంత
శాంతాత్మ లంపంస్వభావప్రభావాదులందాల్చి కార్యత

ంబు ల్పిన్నమంజూచి మన్నించి జీవత్వరాహిత్యమున్నిచ్చి కా
గానపాదిరక్షించుమీజానకీమానసాంభోజభృంగా భజేహంసదా
సజ్జనస్తోమహృత్పద్మవాసాంతరంగా సదాహంభజే భక్తసం
కీర్ణవాగ్వ్యదుర్దోషభంగా భవన్నామచారిత్రముల్ శ్రీపరం
ధామ రామాంకితంబైన చత్వారింశత్త్ర సంఖ్యాకసీసంబు
లంజేసి ప్రఖ్యాతిగానీకు నర్పించి సంతోషితస్వాంతుడై శ్రీ
మద్వెల్లసమయాజాన్వయాంభోధి చంద్రుండు శ్రీనారసింహా
ర్యశిష్యుండు శ్రీవత్సగోత్రుండు పేరాజపుత్రుండు నీదాస
దాసానదాసుండ నన్నొప్పుచున్నట్టి మాసుబ్బశాస్త్ర్యాభిధాన ప్ర
ణీతంబునైనట్టి యీ దండకంబెవ్వరైనన్ మహాభక్తిచే నిత్య
ముంబర్వసంక్రాంతి దోషాది కాలంబులందున్ స్వకార్యార్థ
యాత్రాదులందున్ మహాయాత్రకాలంబునందున్ ఆకస్మా
త్సుగంభీరమైనట్టి చీకాకుగాపింపమారీ మహాశక్తిచే భీతచే
తస్కులైయాపదల్ బొందు కాలంబులందున్ బఠించంగ వా
రింమహాభక్తిచేసిన్నవారింగటాక్షించి నీపాదభక్తిప్రభా
వాదిష్ఠాన యోగంబులన్ కావ్యనిర్వాహమున్ ఓర్పు
ధైర్యంబునున్ సర్వసంపత్సమృద్ధ్యాయురారోగ్యరైశ్వర్య
మున్నిచ్చివారిన్ జన్మాంతమందుంచి రంబైనకైవల్య సౌ
ఖ్యంబులన్నిచ్చి రక్షించుమీ భానువంశాబ్ధి సోమా సురా
రాతి భీమాపరబ్రహ్మ నిత్యస్వరూపా సముద్బోధ శ్రీజానకీరా
మభూపా భజేహంసదా రామచంద్రం సదాహంభజే రామ
చంద్రం భజే రామచంద్రం భజే రామచంద్రం భజే రామచం
ద్రం భజే పాహిమాం పాహితుభ్యంనమస్తే నమస్తే పునస్తే నమః ॥

శ్రీహనుమత్సీతాలక్ష్మణ భరత శత్రుఘ్నపరివారస మేత శ్రీరామచంద్రపరబ్రహ్మణేనమః ఏతత్ఫలంసర్వం శ్రీస ద్గురుపరబ్రహ్మార్పణమస్తు. మంగళంమహా శ్రీ శ్రీ శ్రీ.

శ్రీపరంధామ దండకము,

సంపూర్ణము.



శ్రీ శారదా విలాస ముద్రాక్షరశాల, పాలకొల్లు.

